CONTENTS

# మానవమర్మము

# THE MYSTERY of MAN

## 1. విశుద్ధుడు

---

### మానవుడు — సృష్టికి శిరోమణి

### MAN, the CROWN of the Creation

"దేవుడు — మనస్వరూపమందు మన పోలిక చొప్పున నరులను చేయుదము. వారు సముద్రపు చేపలను, ఆకాశపక్షులను, పశువులను, సమస్తభూమిని, భూమిమీద ప్రాకు ప్రతిజంతువును ఏలుదురుగాక అని పలికెను". (ఆది. 1 : 26 — 28)

### 1. పరమదేవుడగు పరిశుద్ధ త్రిత్వము

### THE HOLY TRINITY IN HEAVEN

తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అను త్రైక దేవుడు నిత్యుడును సత్యుడునై పరలోకములో సింహాసనాసీనుడై యున్నాడు. పరిశుద్ధ త్రిత్వమునకు త్రిపురుషత్వమును, ఆ త్రిపురుషత్వమునకు ఏకత్వమును ప్రత్యేకత్వమును సమానత్వమును కలవు. త్రిత్వములో మొదటిపురుషుడు తండ్రియగు యెహోవా. ఎవడును ఎక్కడను ఎప్పుడును తండ్రిని చూచి యుండలేదు. రెండవ పురుషుడు కుమారుడగు యేసుక్రీస్తు ప్రభువు.

అయిన పాత నిబంధన కాలమున సందర్శన మిచ్చెను, క్రొత్త నిబంధన కాలమున సత్యావతారమెత్తెను. మూడవ పురుషుడు పరిశుద్ధాత్మ. ఆయన విశ్వాసులకు నూతన జన్మమును నూతన జీవమును ఇచ్చుచుండును.

దేవు డొకడున్నాడని మానవ తెలివితోనని గుడ్డిదియు, మూగదియు, చెవిటిదియు అగు హెలెన్ కెల్లరు అను కన్యామణి సూచించెను.

“అందరికి తండ్రియైన దేవుడు ఒక్కడే; ప్రభువు ఒక్కడే; ఆత్మయు ఒక్కడే, (ఎఫె. 4 : 4 — 6).

## 2. పరిశుద్ధ దూతల పరిచారము

## THE MINISTRY OF THE MANIFOLD ANGELS

దేవదూతలు దేవుని సృష్టి. వారు ఆత్మ [illegible] నిరాకారులు; అసంఖ్యాకులు. దేవుడు తన సేవకులగు దూతలను వాయువులుగాను, అగ్నిజ్వాలలుగాను చేసికొనుచున్నాడని తెలియుచున్నది. వారొక జనమువలెను జాతివలె పెంపొందినవారు కారు. ప్రత్యేకులు; ప్రతిష్ఠితులు; వారు పరలోకమున భయభక్తులతో ప్రభుని పూజించుచు, నరలోకమున పరిశుద్ధులకు పరిచారము చేయుచుందురు. మీఖాయేలు మేటి శూరుడు; గబ్రియేలు సువార్తికుడు. ఆదిలో [illegible] ఆనందధ్వనులతో సర్వసృష్టికి స్వాగత మిచ్చిరి (యోబు 37 : 4.7)

దేవదూతలు మనుష్యులకన్న ముందుగా దేవునివలన సృజింపబడిరని జాన్ మిల్టన్ కవీంద్రుడు సెలవిచ్చెను.

“దేవదూతలు ఈ (రక్షణ) కార్యములను తొంగి చూడగోరుచున్నారు”. (1 పేతు. 1:12)

## 3. సర్వసృష్టి స్వాగతము.

## CORDIAL WELCOME OF THE CREATION

త్రైక దేవుడు శూన్యములోనుండి సృష్టిని చేసెనని “బారా” అను హెబ్రీ క్రియనుబట్టి తేటతెల్లమగును. సృష్టిక్రమము ఎంత శ్రేయస్కరము! మొదటిదినమున వెలుగును, మరునాడు విశాలమును, మూడవ

దినమున భూమిని, వృక్షవర్గములను, నాలుగవనాడు జ్యోతులను, ఐదవ దివస
మున ఆకాశపక్షులను అనేక జలచరములను, ఆరవనాడు భూ జంతువు
లను దేవుడు సృజించెను.

మానవోపయోగార్థము ప్రథమమున పదార్థసృష్టిని, తరువాత జీవ సృష్టిని చేసి, సర్వము సంసిద్ధముగా చిట్టచివరను సృష్టికి శిరోభూషణమైయున్న ప్రభువు నరులను కలిగించెను. ఏమీ సన్నాహ స్వాగతము!

జలచరములును, పక్షులునుంటును, భూమిమీదను ఉండు సకల జీవసృష్టి భూగర్భ శాస్త్రసమ్మతమని మంచితాభిప్రాయము. సృష్టి వృత్తాంతమునందు యిది పరిశుద్ధమును పరిపూర్ణమునని విజ్ఞానులేమి విశ్వాసులేమి నొక్కి పలుకుచున్నారు.

"దేవుడు తాను చేసినది యావత్తును చూచినప్పుడు అది మిక్కిలి బాగుగా నుండెను" (ఆది 1:1-31)

## 4. మనుష్యుడు — మట్టి — మహిమస్వరూపి

## MAN - DUST AND DIVINE IMAGE

సర్వజ్ఞుడును సర్వశక్తుడునగు ప్రభువు చిత్రగించిన "జిగటమంటి" బొమ్మ జీవాత్మ గానుండునా? త్రిత్వపు దివ్యాలోచనను బట్టి దేవుని స్వరూపమందు తన పోలిక చొప్పున నరులు చేయబడిరి. దేవుని స్వరూపమనగా ఆయన నిజస్వరూపము (పురుషత్వము) అని కాదు, ఆయన నీతి (పరిశుద్ధ) స్వరూపమని చెప్పనొప్పును. దీపము సూర్యునివలె నున్నట్లు మానవుడు దేవస్వరూపమును కలవాడు.

హెబ్రీభాషలో ఆదామా (ADAMAH) అనగా ఎర్ర మన్ను. అదామను పేరును ఆ మాటనుండియే వ్యుత్పత్తి అయ్యెను. ఆది 2:7 లోని "జీవవాయువు ఊదెను" అనగా మనుజునిలో జంతు, తార్కిక, నైతిక, ఆత్మీయ జీవము కలదని భావము.

శరీరము జీవమునకు నివాసమనియు, జీవము ఆత్మకు దేవాలయమనియు సంఘపితరుడగు టెర్టుల్లియన్ పలికెను. మానవజీవము అత్యల్పమైనను

పారంపర్యము ప్రభుని పారంపర్యమనియు, దేహాత్మల ఐక్యము దేవుడనియు స్ట్రిరెట్ అను మహానీయుడు సెలవిచ్చెను.

"మనము మంటివారమని ఆయన జ్ఞాపకము చేసికొనుచున్నాడు" (కీర్త, 103:14)

## 5. నరుడును నారియు

## MAN AND WOMAN

మానవుడు "ఒంటరిగా" నుండుట మంచిదికాదని అతనికి పాటియైన సహాయమును దేవుడనుగ్రహించెను. అర్ధాంగికి సాటిలేదు; పోటియులేదు. స్త్రీయు "ఒంటరిగా" నుండుట మంచిదికాదు (ఆది3:1) పురుషుడులేని స్త్రీ అబలయు, పురుషునితోనున్న స్త్రీ సబలయు కాబోలు!

సతీపతులకు శరీరమొక్కటి; ఆత్మలు రెండు. ఆదాము అనగా ఎర్రమన్ను; హవ్వ అనగా జీవము. సంసార జీవితమువలన స్త్రీ పురుష సేవాజీవములు సార్థకములగునుగదా? (ఆది 3:19, 20)

సతీపతులు సమానులా?

పురుషునిపై నధికారము సల్పుట - పొలతికి దగదంచున్
శిరమునుండి సృష్టింపనొల్లడది - శ్రేయముకాదంచున్.
పడతిని బదముల ద్రొక్కంజనదని - ప్రభు డుదేశింపన్
అడుగులనుండి సృజింపనొల్లడే - యతివ సంతసింపన్.
ఎక్కువ తక్కువలేమి మనంబున - నెంచకుండ ప్రీతిన్
ప్రక్కటెముకతో సంకల్పించెను - బరగ నొక్కనాతిన్.

మహాసృష్టికొరతను దీర్చుటకు మనుష్యుని, మనుష్యుని కొరతను దీర్చుటకు మహిళామణిని దేవుడు చేయుట భావగర్భితముకదా? (ఆది 2:5, 18)

"పురుషుడైతే దేవునిపోలికయు మహిమయునైయున్నాడు; కాని స్త్రీ పురుషుని మహిమయైయున్నది" (1 కొరి 11:7)

# 6. ప్రకృతికి ప్రభువు

## CHIEF OF THE CREATION

సర్వసృష్టిలో మనుష్యుడు సౌందర్యము, సౌఖ్యము, సౌజన్యము, సౌభాగ్యము, సౌహార్ద్రము మొదలగువాటినిబట్టి ఉత్తమోత్తముడనుట అతిశయోక్తి కాదు. మానవుని మహావైభవ వైచిత్ర్యములేవన—

(1) ప్రకృతి అంతటిలో ప్రత్యేకమైనవాడు. అది సృజింపబడెను; ఇతడు చేయబడెను (ఆది 1,2 అ)

(2) భూలోకమునకు భూస్వామి. (ఆది. 2 : 5)

(3) నానాజంతువులకు నామకరణము చేసినవాడు (ఆది.2:19,20)

(4) భూజంతువులలో బుద్ధిమంతుడు (యోబు. 35 : 11)

(5) ప్రకృతికి పరిపాలకుడు (ఆది 1 : 26)

(6) అఖిల సృష్టిలో అత్యుత్తముడు 'మీరు వాటికంటె బహు శ్రేష్ఠులు కారా?" (మత్త. 6 : 26)

(7) అన్నిటిలోను అత్యధికముగా ఆశీర్వదింపబడినవాడు (ఆది. 1 : 28, 29).

(8) సమస్తము మానవుని కొరకును, సర్వమానవులు ప్రభునికొరకని గ్రహింపగలము (1 కొరి. 3 : 21 — 23)

(9) క్రీస్తు దేవునికిని మానవునకును మధ్యవర్తి. ఏలయన ఆయన దేవుడును మనుష్యుడు నైయుండెను. మనుష్యుడు దేవునికిని జంతువులకును మధ్యవర్తి. అతని దేహము పదార్థము, అతని దేవస్వరూపము పరమార్థము (1 తిమో. 2 : 5 ; ఆది 2 : 19)

ఏమీ మానవ వైభవ వైచిత్ర్యములు!

"మహిమ ప్రభావములతో వానికి కిరీటము ధరింపజేసియున్నావు; నీచేతి పనులమీద వానికి అధికారమిచ్చియున్నావు" (కీర్త. 8 : 3-7)

## 7. నరుడు వానరుడట!

### MAN MONKEY !

చార్లెస్ రాబర్టు డార్విన్ (1809–82) అను ఆంగ్లశాస్త్రజ్ఞుడు పరిణామవాదము (Evolution) అను అసత్య సిద్ధాంతమును స్థాపించి 1871 లో మనుష్యుని అవరోహణము (Descent of Man) అను పొత్తమును ప్రకటింపగా అఖండ క్రైస్తవ ఖండాంతములు వాదించి, సాధించి జయించిరి. నక్కెక్కడ? నాగలోకమెక్కడ? అన్నట్లు నరుడెక్కడ? వానరుడెక్కడ? నరునకును వానరునకును హస్తి మశకాంతరము. అందుకు మన సమాధానమేమనగా—

(1) శాస్త్రజ్ఞులు సందేశించునట్లు "మనుష్యమాంసము వేరు; మృగ (మర్కట) మాంసము వేరు" (1 కొరిం. 15 : 39)

(2) గ్రంథరాజమగు బైబిలు బైలుపరచునట్లు మనుష్యనిర్మాణము వేరు; మర్కట (జంతు) నిర్మాణము వేరు. (ఆది. 1:24, 26, 27)

(3) మనుష్యుడు జీవాత్ముడు; వానరము జీవి. దానికి ఆత్మలేదు (ఆది. 2:7)

(4) తాను సంపాదించిన వివిధ విజ్ఞానసంపద మున్నగువాటిని మానవుడు తన సంతానమునకు అందజేయగలడు. మృగము అట్లొనర్ప జాలదు.

(5) నరునిలో సాంఘిక నైతిక ఆత్మీయాభివృద్ధులు కలవు. అట్టివి జంతువులలో అనరాదు.

(6) మనుష్యుడు మాట్లాడును, గ్రహింపగలడు; పశ్చాత్తాపపడును; పరమానందమొందును. (2 పేతు. 2 : 16; కీర్త. 32 : 9)

(7) అతడు నాగరికుడు; అవి అనాగరికములు. (కీర్త 50 : 11; మార్కు 1 : 13)

(8) మనుష్యుడు క్రీస్తునకు ముంగుర్తు. మృగము క్రీస్తు విరోధికి ముంగుర్తు. (ప్రక. 18 : 2; 20 : 4)

(9) మానవపితృదార్థము క్రీస్తు మనుష్యావతారమెత్తెను (ఫిలి. 2 : 6-8)

(10) మనుజాని దేహము మన్నైపోవును. ఆత్మ దేవసన్నిధికి పోవును. మృగములు మన్నగును. (ప్రస. 12 : 7)

"... మృగములను నాని పాదముల క్రింద నీవు ఉంచియున్నావు" (కీర్త. 8 : 7)

## 8. పరదైసు ప్రథమ నివాసము

## PARADISE, THE FIRST HOME

ఆది స్త్రీ పురుషులకు ఏదేను వనము పరమగృహమైయున్న ప్రథమ నివాసమాయెను. ఏదేననగా సంతోషమని హెబ్రీ శబ్దార్థము. గ్రీకులో పరదైసు (Paradeisos) అనగా ఉద్యానవనమని అర్థము. ప్రస్తుత కాలమందు ఉద్యానవనములు (Parks) చిన్న పెద్దలకు సంతోషదాయకములుగా నున్నవి.

పరదైసులో ఆదాము హవ్వలు పరిశుద్ధత్వముతోడను, పరమ మాతలతోడను, వివిధ జంతుజాలముతోడను అన్యోన్య సమాధాన సహవాస సంతోషములతో కాలయాపనము చేయువారు కాబోలు! జలములు సమృద్ధము, కట్లగ ముండ్లులేవు. చెట్లును పూఫలములుండెను. జంతువులు శత్రుత్వము లేక మిత్రత్వముతో నుండెను. ఆది స్త్రీ పురుషులకు ఆయాస ప్రయాసములు లేవు. జీవవృక్ష మహాత్మ్యమైయుండె వ్యాధి బాధలును లేవు. ఆది భూతల స్వర్గమైయుండెను (యెష. 11 : 6-9; 65 : 25)

ప్రభునితో నుండువారికి ఎల్లపూటలు చల్లపూటలుగా ఒప్పుచుండును. పరదైసు వారికి బడియును, గుడియును, గృహమునైయుండెను. ఏదేను ప్రథమ మానవులకును, యేసుప్రభువు పరిశుద్ధులకును పరదైసు కదా?

“దేవుడైన యెహోవా నరుని తీసికొని ఏదేను తోటను సేద్యపరచుటకును, దానిని కాచుటకును దానిలో ఉంచెను” (ఆది. 2 : 15)

## 9. మనుష్యుడు పరిశుద్ధుడు; కాని పరిపూర్ణుడు కాడు

### MAN PURE, BUT NOT PERFECT

నరుని నానావిధ గుణలక్షణము లేవన

(1) మనుజుడు స్వతంత్రుడు; కాని సర్వ స్వతంత్రుడు కాడు. అతని స్వాతంత్ర్యమునకు హద్దులు కలవు. (ఆది. 2 : 16, 17)

(2) శాకా భక్షుడు; కాని సర్వభక్షకుడు కాడు. శాకాహారము సహజ భోజనము. (ఆది. 1 : 29). ఆది. 9:3 చూడుము.

(3) మనుష్యుడు; కాని మర్త్యుడు కాడు అతడు పాపము చేయకుండినయెడల చావకుండునుగదా! (ఆది. 2 : 7; 3 : 3-19)

(4) యుక్తవయస్కుడు; కాని యుక్తిపరుడు కాడు. మంచి ప్రాయముగలవాడు, కాని మాయికుడు కాడు. అమాయకుడు.

(5) సుకుమారి, కాని సుఖభోగి కాడు. సుఖజీవిగానున్నను నేలను సేద్యముచేయుచు దానిని కాచుచుండువాడు (ఆది. 2 : 5, 15)

(6) అధికుడు, కాని అనుభవజ్ఞుడు కాడు. జ్ఞానసంపన్నుడు, కాని జ్ఞానసంపూర్ణుడు కాడు; శక్తిమంతుడు, కాని సర్వశక్తుడు కాడు.

(7) దిగంబరుడు, కాని దిసమొలవాడు కాడు. అనాగరికుడు కాడు. ఆధ్యాత్మికుడు. దిగంబరత్వము దేహసంబంధము కాదు, దేవసంబంధము (ఆది. 2 : 25: 3 : 7-21)

(8) భర్త, కాని భార్యానుకూలుడు. ఆదాము సర్పశోధనకు లోబడి యుండడు, కాని సతీశోధనకు వెంటనే లోబడెను. సాతాను సర్పమువలన హవ్వను, హవ్వవలన ఆదామును, ఆదామువలన లోకమంతటిని శోధించుట ఎంతటి శక్తి! ఎంతటి కుయుక్తి!! (ఆది. 3 : 17)

“దేవునియందు భయభక్తులు కలిగియుండి, ఆయన కట్టడల ననుసరించి నడుచుచుండవలెను. మానవకోటికి ఇదియే విధి.” (ప్రస. 13 : 13).

## 10. మొదటి ఆదాము రెండవ ఆదాము(క్రీస్తు)నకు ముంగుర్తు

### FIRST ADAM & SECOND ADAM

ఆదాము క్రీస్తునకును, హవ్వ సంఘమునకును ముంగుర్తులు.

(1) మొదటి ఆదాము జీవించుప్రాణి. రెండవ ఆదాము జీవింపజేయు ఆత్మ. (1 కొరి. 15 : 45)

(2) ఆదాము మంటినుండి పుట్టినవాడు. క్రీస్తు పరలోకమునుండి వచ్చినవాడు (1 కొరి. 15 : 47)

(3) ఆదామువలన వినాశనమును, క్రీస్తువలన విమోచనమును కలిగెను (రోమా 5 : 19)

(4) మొదటి ఆదాము ప్రక్కలోనుండి మొదటి హవ్వయు, క్రీస్తు ప్రక్కలోనుండి రెండవ హవ్వయగు సంఘమును తీయబడెను. (ఆది. 2 : 20-25; యోహా. 19 : 34; ఎఫె. 5 : 25-27)

(5) మొదటి ఆదాము శోధనలో పడెను, కాని క్రీస్తుశోధనలను జయించెను (ఆది. 3 : 1-24; మత్త. 4 : 11)

"ఆదాము రాబోవువానికి గుర్తైయుండెను" (రోమా. 5 : 14)



# 2. వినాశము



## మానవుడు - సర్వలోకశాపము

## MAN, The CURSE of the COSMOS

యెహోవా "ఆదామును చూచి — నీవు నీ భార్యమాటవిని — తినవద్దని నేను నీ కాజ్ఞాపించిన వృక్షఫలములు తింటివి, కనుక నీ నిమిత్తము నేల శపింపబడియున్నది . . — నేలనుండి నీవు తీయబడితివి, నీవు మన్నే కనుక తిరిగి మన్నైపోదువని చెప్పెను" (ఆది. ౩: 17-19)

### 1. సాతాను సంహారక సంకల్పము

### THE DESTRUCTIVE DESIGN OF THE DEVIL

దేవదూతలలో కొందరు గర్వాంధులై పరలోకభ్రష్టులైరి. త్రియేక దేవునివలన సాతానును వానిదూతలగు దయ్యములును పరలోకమునుండి ఆకాశమునకును, అక్కడనుండి భూమిమీదికిని, పడద్రోయబడిరి. అచ్చటినుండి పాతాళమునకును, నరకమునకును పంపబడుదురు, అది వారి నిత్యనివాసము. వారి పని యెంత భయంకరము!

అపవిత్రదూతల నాయకుడు వినాయకుడు. వాని పేరేమో తెలియదు. లూసిఫరు (వెలుగుదూత) అని జాన్ మిల్టనును, ఇబ్లీసు (నిరాశ) అని మహమ్మదును పేర్కొనిరి. వాడు అపవాదము చేయుచున్నట్లు వానికి అపవాది, సాతాను మున్నగు ౩1 నారక నామములు కలవు. సాతానుకు సహితము త్రిత్వముకలదు. అపవాది — దేవవిరోధి, క్రూరమృగము — క్రీస్తువిరోధి, అబద్ధప్రవక్త — ఆత్మవిరోధి. దేవునివలె సాతాను సర్వజ్ఞుడును, సర్వశక్తుడును, సర్వవ్యాపియు కాడు.

అపవాది స్వరూపము అప్రీతియు, తల అపవిత్రతయు, నోరు అబద్ధమును, కన్నులు అహంకారమును, పాదములు అవిధేయతయు, చేతులు అపకారమును, హృదయము అక్రమమును, వెన్నెముక అస్థిర మంత్రములు అసూయయు కాబోలు!

దేవునిమీద తిరుగుబాటు చేసిన సాతాను వేరొక రాజ్యమును స్థాపించుకొని అపవిత్రదూతల సహాయముతోపాటు దేవుని స్వర్గ సామ్రాజ్యమును సమూలనాశనము చేయుపూనుకొని యున్నాడు. ఏమీ వారి దుష్కార్యము! ధైర్యము!! ఉడుత ఊపులకు కొపలు కదులునా? (యూదా. 6:2 పేతు. 2:4; ప్రక. 12:7-9; 13:4-15; 20:1-15)

"సమాధానకర్తయగు దేవుడు సాతానును మీ కాళ్లక్రింద శీఘ్రముగా చితకత్రొక్కించును" (రోమా 16:20)

## 2. సర్పము అపవాది అవతారము

## SERPENT–SATAN'S INCARNATION

సర్వజంతువులలో సర్పము శక్తియు యుక్తియు కలిగి, నిట్రముగానిలిచి యుండి ఎగురుచుండెనని ఎల్లరందురు. పరమదేవుని సంరక్షక సంకల్పమును సమూలనాశము చేయతలంచి, సర్పావతారమును వహించి అబలయగు హవ్వను, హవ్వమూలమున భార్యానుకూలుడగు ఆదామును. వారి మూలమున భూజనులందరిని మోసపుచ్చుట ఎంతవింత! ఎంతచింత!

సాతాను సంభాషణములు శర్కరా పూరితములు. దేవుడు నిర్దయుడు, మీరు నిత్యులు; దేవతల నిజస్వరూపమున నుండెదరని మూడు శబ్దాబద్ధములు పలికి, శారీరాశ, నేత్రాశ, జీవపుడంబము అను మూడు సిద్ధాయుధములు ప్రయోగించుటకు సాతాను సంకల్పించుకొని, సఫలత నొందెను. ఈ మూడబద్ధాలును మూడాయుధాలును నేడు నిత్యము ప్రయోగించుట సత్యము (ఆది. 3 : 1; యెష. 14 : 29; 1 యోహా. 2 ; 16).

ఆదాము అవ్వను ప్రేమించి నందున ఆ పండు తానును తిని, ఆమెతోపాటు నశింపగోరెనని జాన్ మిల్టన్ (Paradise Lost Book IX) సెలవిచ్చెను.

"సర్వలోకమును మోసపుచ్చుచు...ఆది సర్పమైన ఆ మహాఘట సర్పము పడద్రోయబడెను." (ప్రక.12:9)

## 3. మానవుని మరణకర మహాపాతకము

## MAN'S MORTAL SIN

గ్రీకు భాషలో పాపము (Amartia) అనగా గురితప్పుట.

ఆది తల్లిదండ్రులు తమ్మును సంరక్షించు దేవునాజ్ఞను తిరస్కరించి, తమ్మును సంహరించు సాతానుమాటను సన్మానించుట ఎంత భయంకరము! వారు దేవుని ప్రేమింపకయు, దేవునికి లోబడకయు, దేవుని మహిమపర్చకయు నుండుట ఎంత కృతఘ్నత!

ప్రభువునకు ప్రతికూలమును, అపవాదికి అనుకూలమును, మనుష్యునికి మరణకరమును అగునదే మహాపాతకము. దురాశతల్లి; దుష్టత్వము కుమారె; దుర్మరణము మనుమరాలని సత్యవేదము చాటును. (యాకో. 1 : 15).

వేదాంతియగు హారిసన్ ఇట్లనియె — పాపికిగల నాల్గు ముఖ్య సూచన లేవన — (1) విశ్వాసమునకు మారుగా స్వయోగ్యత; (2) విధేయతకు బదులుగా స్వచిత్తము; (3) ప్రేమకు మారుగా స్వలాభము (4) వినయమునకు బదులుగా స్వనీతి. ఇవే మొదటి ఆదాము ముఖ్య పాపములు.

సాతాను యొక్క పాపము లోపటి (within) నుండి కలిగినందున వాడు శిక్షింపబడును. మనుజుని పాపము బైట (without) నుండి కలిగినందున అతడు రక్షింపబడును. ఏమీ భేదము!

"భయమునొంది, పాపము చేయకుడి" (కీర్త. 4 : 4)

## 4. బోర్లపడిన భూలోకము

## THE TOPSY-TURVY WORLD

భూమి దేవదేవుని పాదపీఠము. అది దేవుని మంచితనముతోడను, మహైశ్వర్యముతోడను, మహిమతోడను నిండియుండెను (మత్త. 6 : 10; కీర్త. 33 : 5; 104 : 25; యెష. 6 : 3)

ఆదాము హవ్వల అవిధేయత వలన భూలోకము తలక్రిందయ్యెను. ఎట్లన —

(1) పరదైసు భ్రష్టమయ్యెను (ఆది. 3)

(2) దయ్యాల రాజ్యము స్థాపితమయ్యెను (మత్త. 12 : 24-26; యోహా. 12 : 31)

(3) మానవజాతి అంధులై పడిపోయెను, చెడిపోయెను (ఆది. 5 : 3; యోబు 15 : 14; కీర్త. 51 : 5)

(4) ప్రపంచము పాపభరితమయ్యెను (ఆది. 6 : 6, 7; రోమా 5 : 12)

(5) నేల శపింపబడి నిష్ఫలమయ్యెను (ద్వితీ. 28 : 23; కీర్త. 107 : 34)

(6) సర్వభూమి శాపగ్రస్తమయ్యెను. పూలు ముండ్లయ్యెను (ఆది. 3 : 17)

(7) అది సాతాను విహారస్థానమయ్యెను (యోబు. 1 : 7; 1 పేతు. 5 : 8)

(8) సర్వలోకము క్షయాధీన దాస్యమునకు లోబడెను (యెష. 24 : 4; రోమా 8 : 19-22)

(9) జలప్రళయమున జననాశనమయ్యెను (ఆది. 7 : 17-24)

(10) అంత్యదినమున అగ్నివలన పాడగును (2 పేతు. 3 : 7-12)

(11) పాపఫలితమున భాషలు తారుమారాయెను. ఆదిభాష హెబ్రీభాష (ఆది. 11 : 9)

"సృష్టి క్షయాధీన దాస్యములోనుండి... స్వేచ్ఛగా కాక దానిని లోపరచిన వానిమూలముగా వ్యర్థపరచబడి ... ఏకగ్రీవముగా మూలుగుచు ప్రసవవేదన పడుచున్నది" (రోమా 8 : 19-22)

## ౫. సంసార సంకటము

## THE FAMILY FAILINGS

ప్రథమ కుటుంబముయొక్క పాప పతనమువలన ప్రపంచ కుటుంబము అన్నియూ భ్రష్టమయ్యెను. 'యథాబీజం తథాంకురము' అను లోకోక్తి అతిశయోక్తి కాదు. కుటుంబ పాపఫలితము లేవన—

(1) సతీపతులకు దుష్టజీవితమును కష్టజీవనమును కలిగెను. (ఆది. 3 : 16 — 23)

(2) దుష్టుల సంతానము సాతాను సంతానము అయ్యెను. (అపొ. 13 : 10; 1 యోహా. 3 : 10)

(3) పురుషుడు ప్రయాసముతో పాటుపడును; స్త్రీ ప్రయాసముతో ప్రసవించును. (ఆది. 3 : 16 — 19)

(4) దుర్మార్గులగు బిడ్డలు తల్లిదండ్రులకు దుఃఖకారకులు (సామె. 10 : 1; 17; 19 : 13; 30 : 17).

(5) తలిదండ్రుల పాపములు బిడ్డలకు శాపసాధనములు (నిర్గ. 20 : 5; యెష. 14 : 20).

(6) వ్యాధి బాధలును, కరవులును కష్టములును పాపఫలితములు (యెష. 1 : 5; యోహా. 5 : 14; కీర్త. 105 : 6)

(7) వస్త్రధారణమును పాపఫలితము (ఆది. 3 : 6, 21)

(8) పరిత్యాగమును, బహుపత్నీత్వమును పాపసంభవము (మత్త. 5 : 32, 19 : 9, 1 కొరి. 7 : 2-4)

(9) మాంస భక్షణమును జలప్రళయము తర్వాత ప్రారంభమాయెను (ఆది. 9 : 3)

(10) ఆయుష్కాలము అల్పమును, అత్యల్పము నయ్యెను (యోబు 14 : 1, కీర్త. 9 : 10)

(11) పతితుడగు మానవుడు పరలోకరాజ్య ప్రవేశము పొంద జాలడు (1 కొరి. 6 : 9, 10; గల. 5 : 19-21; ప్రక. 21 : 27)

'అనేక విషయములలో మనమందరము తప్పిపోవుచున్నాము.' (యాకో. 3 : 2)

## 6, మనుష్యుని మరణములు

## THE DOUBLE OR TRIPLE DEATH.

పాప ప్రవేశమువలన ఈ ప్రపంచము సమాధుల దొడ్డి (Cemetery) అయ్యెను. 'జాతస్య మరణం ధ్రువం' అన్నట్లు మానవుని బిడ్డ లందరు మరణింతురు. హెబ్రీభాషయందు ఆది. 2:17 లోని "చచ్చుచు నీవు చచ్చెదవు" అను మాట యెంత గాఢములు! మరణములు మూడు —

(1) శరీర మరణము — మరణమనగా ఆత్మ శరీరమునుండి వేరగుట. మనుష్యుడు మర్త్యుడు (Mortal) అయినను పాపము చేయకుండినయెడల అమర్త్యుడు (Immortal) అయ్యెడివాడే. ఆదాముమూలమున వచ్చిన పాపమును జన్మపాపమందురు. జన్మపాపఫలితమే శరీరమరణము (కీర్త. 51 : 5)

(2) ఆత్మీయ మరణము — అనగా పాపమువలన ఆత్మ దేవుని సన్నిధినుండి వేరగుట. ఈపాపమును కర్మ (స్వకీయ) పాపమందురు. స్వకీయ పాపఫలితమే ఆత్మీయ మరణము. ఒకడు మారు మనస్సుపొంది క్రీస్తును నమ్మి, బాప్తిస్మమును పొందునెడల పునర్జీవము (నిత్యజీవము) పొందును. (ఎఫె. 2 : 1; యాకో. 5 : 20)

(3) నిరంతరాత్మీయ మరణము. అనగా పాపమువలన ఆత్మ దేవుని సన్నిధినుండి నిరంతరము వేరగుట. ఆత్మీయమరణ మొందినవాడు మారుమనస్సు పొందకయు, ప్రభుని విశ్వసించి బాప్తిస్మ మొందకయు నుండి అవిశ్వాసియై నిత్యనాశనము పొందును. (2 థెస్స. 1 : 9, 10; మత్త. 25 : 46)

మహాతత్త్వవేత్తయగు అరిస్టాటలు (క్రీ. పూ. 384-82) ఇట్లనియె: — నేను పాపములో జన్మించితిని, అశాంతిలో జీవించితిని. నిరీక్షణ లేక మరణించుచున్నాను.

'పాపమువలన వచ్చు జీతము మరణము' (రోమా 6 : 23)

## 7. దయ్యాల తంత్రాలు

## THE DEVICES OF THE DEVIL

సాతాను దేవునికిని, మానవునికిని గర్భశత్రువై జరిగించు కాని పనులేవన —

(1) దైవసంకల్పమును తలక్రిందు చేయుటకు పలుతెరగుల ప్రయత్నించును. (1 థెస్స. 2 : 18)

(2) దేవోక్తులను త్రిప్పిచెప్పును. (మత్త. 4 : 6; కీర్త. 91 : 11,12)

(3) సిలువకు శత్రువై చెడుగుచేయును. (మత్త. 13 : 19; 2 థెస్స. 4 : 4)

(4) దైవానుమతితో దైవజనులను శోధించి, బాధించును. (యోబు. 1 : 12, 2 : 4-7)

(5) సంఘనాయకులను జల్లించును. (లూకా. 22 : 31)

(6) పరిశుద్ధులను భ్రష్టుల జేయును. (1 తిమో. 4 : 1)

(7) వెలుగు దూత వేషముతో చీకటి పనులు చేయును. (2 కొరి. 11 : 14)

(8) మనుష్యులను మోసగించుటకు మహాత్కార్యములు చేయును. (2 థెస్స. 2 : 9; ప్రక. 16 : 14)

(9) దుర్మార్గులను దుర్గతికి నడిపించును (లూకా. 22 : 3)

(10) పిన్నపెద్దలను పట్టి పీడించును (మత్త. 15 : 22; లూకా 8 : 2)

"అపవాదిని ఎదిరించుడి, అప్పుడు వాడు మీయొద్దనుండి పారిపోవును" (యాకో. 4 : 7)

## 8. మంచిచెడ్డల మహావైరము

## ENMITY BETWEEN GOOD AND EVIL

దేవుని దృష్టికి 'మిక్కిలి బాగుగా' నుండినది ఎంత త్వరగా "మిక్కిలి ఓగుగా" అయ్యెను! నరుని పాటువలన ఎంత చేటుకల్గెను! ప్రశాంతము అశాంతమాయెను. మంచిచెడ్డలకు మహావైరము కల్గెను. ఎట్లన —

(1) దైవమునకును దయ్యమునకును ఎంతో విరోధమయ్యెను. (2 కొరి. 7 : 15)

(2) దేవునికిని మానవునకును వైరమయ్యెను. (2 కొరి. 5 : 20, 21)

(3) మనుష్యులలో మహాశత్రుత్వ మేర్పడెను. (2 కొరి. 7 : 15)

(4) మనుష్యులకును జంతువులకు విరోధమాయెను. (ఆది. 3 : 15)

(5) జంతువులలో శత్రుత్వమయ్యెను. (1 సమూ. 17 : 34, 35)

(6) మనుష్యులకును దయ్యములకును విరోధమయ్యెను. (1 పేతు. 5 : 8)

(7) కుటుంబికులలో శత్రుత్వ మేర్పడెను. (మత్త. 10 : 35–36)

(8) సంఘములో కక్షలయ్యెను. (1 కొరి. 1 : 10–12)

(9) భోజనపదార్థములలో ప్రతికూలతలయ్యెను. (రోమా. 14:2)

(10) మనుజుని శరీరాత్మలకు విరోధమయ్యెను. (గల. 5 : 17)

(11) సుగుణ దుర్గుణములలో వైరముకలదు. (2 కొరి. 7 : 14)

(12) మోక్షనరకములకు ప్రత్యేకత్వము కలదు. (లూకా. 16:26)

"నీకును స్త్రీకిని, నీ సంతానమునకును ఆమె సంతానమునకును వైరము కలుగజేసెదను." (ఆది. 3 : 15)

## 9. దుర్మార్గత వలని దశ దుర్దశలు

## THE WOES OF WICKEDNESS

మానవ దశ దుర్దశలు మహాసంతాపకరములు. ఎట్లన —

(1) సర్వేశ్వరునకు నరుడు అప్రయోజకుడు.

'నరుల్ దేవునికి ప్రయోజనకారులగుదురా ? కారు'. (యోబు. (22 : 2)

(2) సన్మానమునకు అపాత్రుడు.

'మనుష్యుడు ఏపాటివాడు, అతని ఘనపరచ నేల ?' (యోబు 7 : 17; కీర్త. 8 : 4)

(3) సంకటములలో అసహాయుడు.

'నీవే మాకు సహాయము అనుగ్రహింపుము.' (కీర్త. 60 : 11)

(4) సశరీరమున అత్యల్పుడు.

'మనుష్యుడు మంటినుండి పుట్టినవాడు'. (1 కొరి. 15 : 47)

(5) సమస్త సృష్టిలో అవిధేయుడు.

'తినవద్దని నేను నీకు ఆజ్ఞాపించిన వృక్షఫలములను నీవు తింటివి.' (ఆది. 3 : 17)

(6) సంభవమున అపవిత్రుడు.

'నేను పాపములో పుట్టినవాడను.' (కీర్త. 51 : 5)

(7) సంఘటనలో అజ్ఞాని.

'కలుగబోవునది ఏదో మనుష్యులు ఎరుగకయుండినను...' (ప్రస 10 : 14)

(8) సంతానమునకు అపకారి.

'ఒకని అపరాధము వలన అనేకులు చనిపోయిన పక్షమున...' (రోమా. 5 : 12-19)

(9) సర్వప్రవర్తనలో అహంకారి.

'మనుష్యులు వట్టి నీడ వంటివారై తిరిగెదరు' (కీర్త. 39 : 6)

(10) సన్మార్గమున అశక్తుడు.

'మనుష్యులు తమ ప్రవర్తనయందు సన్మార్గమున ప్రవర్తించుట వారి వశములో లేదనియు నే నెరుగుదును.' (యిర్మీ. 10 : 23)

'మేము జిగటిమన్ను; నీవుమాకు కుమ్మరివాడవు.' (యెష. 64 : 8)

## నరుడే నరకము!

## THE HUMAN HELL!

నరుడే నరకము కాబోలు! నరకమనగా సమాధి (Shoel), మృతులలోకము, నిత్యాగ్ని (Hades) అందురు. నరుడు సున్నము కొట్టిన సమాధి (మత్త. 23 : 27), త్రొక్కబడిన పీనుగు (యెష. 14 : 19), అగ్నిగుండము (కీర్త. 21 : 9) కదా? మత్త. 23 : 15 లో ఒకడు 'నరక కుమారు' డనియు చెప్పబడెను. నరుడు నరకమనిన అతిశయోక్తి కాదు, అనుభవోక్తియే. ఎట్లన —

(1) మతభ్రష్టుడగువాడు మహానరకము —

'ఒకసారి వెలిగింపబడి...తప్పి పోయినవాడు... దేవుని కుమారుని మరల సిలువ వేయుచున్నాడు. అట్టివానిని మరల నూతనపరచుట అసాధ్యము' (హెబ్రీ. 6 : 1-8)

(2) సత్యదేవునితోడి సంపూర్ణవియోగము నరకము.

'దేవుని మరచువారందరు పాతాళమునకు దిగిపోదురు' (కీర్త. 9 : 17)

(3) సాతానుతోడి సంయోగము నరకము.

'పాపము చేయువాడు అపవాది సంబంధి' (1 యోహా. 3 : 8)

(4) శరీరకార్యములు జరిగించుట నరకము —

'శరీరకార్యములను చేయువారు దేవుని రాజ్యమును స్వతంత్రించుకొనరు.' (గల. 5 : 19-21)

(5) దురభ్యాసముల దుర్గతి నరకము —

'దాని అడుగులు పాతాళమునకు చక్కగా చేరును'. (సామె. 5 : 8)

(6) అవయవములు అనీతి సాధనములగుట నరకము —

'వాటివలన దేవుని ఉగ్రత అవిధేయుల మీదికి వచ్చును. (కొలొ. 3 : 5, 6)

(7) పాపప్రభుత్వము నరకము —

'పాపమువలన వచ్చు జీతము మరణము'. (రోమా. 6 : 23)

(8) మంత్రతంత్రాల మాయ నరకము —

'మాంత్రికులు విగ్రహారాధికులు అగ్ని గంధకములతో మండుచుండు గుండములో పాలుపొందుదురు' (ప్రక. 21 : 8)

'ఆకాశము మట్టుకు హెచ్చింపబడెదవా? నీవు పాతాళము వరకు దిగిపోయెదవు.' (మత్త. 11 : 23)

# 3. విశ్వాసి

## మానవుడు - క్రీస్తుయొక్క సిలువ

## MAN, The CROSS of CHRIST

'దేవుడు నిశ్చయించిన సంకల్పమును, ఆయన భవిష్యత్ జ్ఞానమును అనుసరించి అప్పగింపబడిన యీయనను (క్రీస్తును) మీరు దుష్టుల చేత సిలువ వేయించి చంపితిరి'. (అపొ. 2 : 23)

### 1. గొఱ్ఱెపిల్ల యొక్క గొప్పబలి

### THE LAMB OF GOD SACRIFICED LONG AGO

దేవుని గొఱ్ఱెపిల్లయొక్క దివ్యబలి 'జగత్తు పునాది వేయబడకమునుపే' అనగా ఆదాము హవ్వల పతనమునకు ముందే నియమింపబడుట ఎంత ఆదరణీయము! దైవసంకల్పము తాత్కాలికము కాదు, సమయోచితమును సంపూర్ణమునై యున్నది. (1 పేతు. 1 ; 18-21, ప్రక. 18 : 8)

సుమారము నాలుగువేల యేండ్లకు పూర్వమే అపూర్వమగు ప్రథమ సువార్త (Protevagelium) ప్రత్యేక దేవునివలన తెలియపర్చబడెను. ఇందు క్రీస్తు విరోధియొక్క వినాశమును క్రీస్తువలని విమోచనమును ప్రవచనార్థముగా ప్రస్తావింపబడెను. (ఆది. 3 : 15)

దాదాపు ఏడువందల యేండ్లకుముందే 'ఐదవసువార్త' (యెష. 53) లో సిలువ సువార్త సువర్ణ వర్ణములతో వర్ణింపబడెను. అందు కల్వరిలోని సిల్వయొక్క సుదర్శనము ప్రదర్శింపబడెను.

గొఱ్ఱెపిల్ల క్రీ. శ. 30 ఏప్రిలు 7 తేది శుక్రవారము సాయంకాలము 3 గంటలకు మహాబలి అయ్యెను.

చిట్టచివరకు దేవుని గొఱ్ఱెపిల్లయు తన సిలువ బలి మూలముగ సింహాసనము లభించుటయు, ఆయన విమోచిత దాసులు అచ్చట జీవించుచు, ఆయనను సేవించుటయు ఎంత శ్రేయస్కరము! (ప్రక. 22 : 1-5)

సువార్త (Gospel) అనగా దేవుని కథ (God's Spell) అని భావము. ఇది జగత్ సువార్త. జయసువార్త.

'దేవుని గొఱ్ఱెపిల్ల జగత్తు పునాది వేయబడక మునుపే నియమింపబడెను.' (1 పేతు. 1 : 20)

## 2. జగద్రక్షకునికి జగత్ స్వాగతము

## THE WORLD WELCOMES THE WORLD'S SAVIOUR

సర్వలోకము లోకరక్షకుని రాకకొరకు సంసిద్ధమై యిచ్చిన సత్ స్వాగతము లేవన —

(1) యూదులు చెదరిపోయి సర్వదేశములలో యెహోవా దేవుని పూజించుచు, మెస్సీయా రాకకొర కెదురుచూచుచు, అన్యులకు బోధించి వారిని యూదామత ప్రవిష్టులనుగా చేయుచుండిరి.

(2) విగ్రహారాధక మతములందలి యాజకులు తమ దేవతలందును. మతస్థులు తమ దేవతలందును, యాజకులందును నిరాశచెంది జగద్రక్షకుడెప్పు డవతరించునా అని ఎదురు చూచుచుండిరి.

(3) మహా అలెక్సాండరు జయములవలన సర్వలోక సామాన్య భాష అయిన గ్రీకు భాషలోనికి ప్రపంచ ప్రారంభ వేదమగు పా. ని. తర్జుమా చేయబడెను. అదియే సెప్టుయజింటు (LXX). దానిని చదివి అనేకులు లోకరక్షకుని రాకకొరకు కనిపెట్టుచుండిరి.

(4) రోమా సామ్రాజ్యము వేయించిన రాజమార్గముల వలనను, వాణిజ్యాదులవలనను జాతిభేదములు చాలమట్టుకు తగ్గి, సహోదర భావ మేర్పడుచుండెను.

(5) రోమా చక్రవర్తియగు కైసరాగస్తు అమున ఐరోపా, ఆఫ్రికా, ఆసియా దేశములు సుభిక్షముగా నుండెను. అట్టిసమయమున మనుష్యులు మత విషయములను సంస్కరించి వేదపారాయణము చేయుటకు వీలుకలిగెను.

(6) చీనా మహాబోధకుడగు కన్ఫ్యూషియసును, గౌతమబుద్ధుడు, పార్శీమత స్థాపకుడగు జొరాస్టరు, గ్రీసు తత్త్వశాస్త్రియగు ప్లేటో, రోమా మహాకవి వర్జిల్ మున్నగు మహనీయులు పల్కిన ప్రవచనోక్తులు ఫలించెనోయని అనేకులు ప్రకాశించునని కోరుచు ఎదురుచూచుచుండిరి.

(7) 'ఇదిగో కన్యక గర్భవతియై కుమారుని కనును ఆయనకు ఇమ్మానుయేలను పేరు పెట్టబడును' అను దేవోక్తులు జీవోక్తులని అనేకులు నమ్మి రక్షకుని రాకడకొరకు ప్రతీక్షించుచుండిరి.

అట్టి సమయమున యేసుక్రీస్తు అను నామమున ఏక జగద్గురువు పాలస్తీను దేశమున బెత్లెహేములో వెలసెను.

రోమాను నరకములో నుండి యేసుక్రీస్తు పరదైసును సృజించెనని గ్రహించి తత్త్వవేత్తయగు రెనెన్ అనెను.

'కాలము పరిపూర్ణమైనపుడు దేవుడు తనకుమారుని పంపెను.' (గల. 4 : 4)

## ౩. పాపియే ప్రభుని సిలువ

## THE SINNER, THE CROSS OF CHRIST

ప్రభుని సిలువవేసినది పాపియే. పాపి రక్షణార్థము ప్రభువు సిలువ మరణమొందెను. పాపియే ప్రభుని సిలువ అనుటకు పండ్రెండు కారణము లేవన —

మనుష్యుడు నిలువబడి, చేతులు చాచినయెడల సిలువాకారము ఏర్పడును. పాప మానవుని సిలువకే ప్రభువు కొట్టబడెను. శిక్షార్థమగు సిలువ ఇదే.

(1) ఆదాము హవ్వల అవిధేయత వలన పాపము లోకములో ప్రవేశించెను. (ఆది. 3 : 6, 7; రోమా. 5 : 12)

(2) ప్రతి మానవుడు పాపమునందే పుట్టుచున్నాడు. (కీర్త. 51 : 5)

(3) ప్రభువైన క్రీస్తు తప్ప ప్రతి మనుజుడు పాపాత్ముడని సత్యవేదము శాసించును. (రోమా. 3 : 22, హెబ్రీ. 7 : 26)

(4) పాపము చేయలేదనుకొను ప్రతి వ్యక్తియు శుద్ధాబద్ధికుడు. (1 యోహా. 1 : 10)

(5) మనుష్యుడు పాపాత్ముడై శారీరమరణమును, శాశ్వతాత్మీయ మరణమును సంపాదించుకొనియె. (రోమా 6 : 23; ఆది. 2 : 17; యెహె. 18 : 4)

(6 పాపి పరలోకములో ప్రవేశింపజాలడు. (1 కొరి. 6 : 9; ప్రక. 21 : 27)

(7) పాపాత్ముడు క్రియలవలన పాపపరిహారము పొందజాలడు. (సామె. 20 : 9)

(8) పతితుడు తనకొరకు ప్రాయశ్చిత్తము చేసికొనలేడు. (మీకా. 6 : 7)

(9) రక్తబలి లేకున్న రక్షణ లేదు. (హెబ్రీ. 9 : 22)

(10) పాపకారకుడగు సాతాను మానవ శిక్షకుడే, కాని రక్షకుడు కాడు. (యోహా. 8 : 44)

(11) మానవ రక్షణార్థము త్రియేకదేవుడు ముక్తిమార్గమును సిద్ధపర్చెను. (యోహా. 3 : 15, 16)

(12) జంతుబలి కాదు, జగద్గురువగు యేసుక్రీస్తే పాప పరిహారార్థము పాపరహితమగు ప్రాయశ్చిత్తము చేసెను. (యోహా. 1 : 29; 1 యోహా. 3 : 5)

'నేను భూమిమీదనుండి పైకెత్తబడినప్పుడు అందరిని నాయొద్దకు ఆకర్షించుకొందును'. (యోహా. 12 : 32; 3 : 15)

# 4. సత్యావతార సాఫల్యతలు

## THE RESULTS OF THE REAL INCARNATION OF CHRIST

మానవమాత్రులగు మతోద్ధారకులు ఎందరో జన్మించిరి, జీవించిరి, జరిగిపోయిరి, కాని లోకైక రక్షకుడగు యేసుక్రీస్తు పవిత్ర కన్యకు జనియించెను. పాపరహితముగా జీవించెను, ప్రాయశ్చిత్తార్థ మరణమును జయించెను. పరలోకములో జీవించుచున్నాడు. జగజ్జయుడై రాబోవుచున్నాడు. పాపపరిహారార్థము ఆయన చేసిన ఐదు పనులను, వాటి ఫలితములను ఆలోచింతము.

(1) అవతారము — జగద్రక్షకుని జననముచేత దేవద్రోహియగు పాపి త్రైక దేవునితో సమాధానము పొందెను. క్రీస్తే సమాధాన ప్రభువును, వరదాతయును, ప్రబోధకుడునై యున్నాడు. (లూకా 2 : 14; 2 థెస్స. 3 : 16, 1 యోహా. 2 : 2)

(2) అర్పణము — ప్రభుని బల్యర్పణమున పాపి పరిశుద్ధుడయ్యెను. అది దేవునికి దివ్యార్పణమును, పాపికి ప్రాయశ్చిత్తమును, సాతానాదికి అపజయమునై యున్నది. (1 యోహా. 1 : 7, లూకా. 24 : 40, అపో. 17 : [illegible])

(3) అమరత్వము — క్రీస్తు పునరుత్థాన ఫలితమున మర్త్యుడు అమర్త్యుడాయెను. పాపమునకు జీతమగు మరణమును క్రీస్తు పొందెను, పతితునకు జీవమును జీవ సమృద్ధి నొసగెను. ఆది. 2 : 7 తో యోహా. 20 : 22 సరిపోల్చుము. (1 కొరి. 15 : 20, 21. ఎఫె. 2 : 1)

(4) ఆరోహణము — ఆయన ఆరోహణము ఐహికాముష్మికములకు వంతెనకదా? పరదేశునకు మారుగా పరలోకప్రాప్తి కలిగెను. పరిశుద్ధాత్మను పొందెను. (యోహా. 14 : 2, 3, 16 : 7, అపో. 2 : 38)

(5) ఆగమనము — ఆయన రెండవమారు వచ్చునపుడు పునరుత్థానము పొందిన విశుద్ధులును, తత్సమయమున సజీవులగు విశ్వాసులును ఆయనను మేఘములలో ఎదుర్కొందురు. (1 థెస్స. 4 : 16–18)

(6) ఆధిపత్యము — ప్రభునితో కూడ పరిశుద్ధులు వెయ్యేండ్లు రాజ్య పరిపాలన చేయుదురు. ఏమి ప్రభుని పరిపూర్ణ ప్రాయశ్చిత్త ఫలితములు! (ప్రక. 20 : 1-6)

యేసుక్రీస్తు నామముననే రక్షణ పొందగలము, గాని 'ఆకాశము క్రింద మనుష్యులలో ఇయ్యబడిన మరి ఏ నామమున రక్షణ పొందలేము.' (అపొ. 4 : 12)

## 5. సంపూర్ణ సంరక్షణకు ఐదు అంతస్తులు

## THE FIVE STAGES FOR THE FULL SALVATION

మానవుడు పోగొట్టుకొనిన పరమదైవ సాయూజ్యమును తిరిగి అతను గ్రహించుటకు ప్రత్యేక దేవుడు చేసిన దివ్యసంకల్పము వర్ణనాతీతము. పౌలు దానిని రోమా. 8 : 29, 30 లో తెలుపర్చెను. అందు ఐదు అంతస్తులు కలవు. వాటిలో మొదటి రెండు మానవు డెరుగడు. తరువాతి రెండు మానవు డెరుగును. చివరిది శ్రేష్ఠమైనది. ఇది మరణానంతరమున జరుగును.

(1) ఎరుగుట — సర్వజ్ఞుడగు దేవుడు పాపిని ముందుగా ఎరుగును. ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, ఎట్లు, ఎందుకు రక్షణ పొందవలెనో ఆయన ముందుగా ఎరుగును. దేవుని భవిష్యద్ జ్ఞానము అనర్థకమును, నిరర్థకమును కాదు, సార్థకము. (1 పేతు. 1 : 2, అపొ. 2 : 23)

(2) ఏర్పరచుకొనుట — సర్వశక్తుడగు దేవుడు పతితుని రక్షణార్థము ఏర్పరచుకొనును. ఆయనకు సర్వస్వాతంత్ర్యము కలదు. వాని గుణలక్షణములనుబట్టి కాక, తన కృపనుబట్టి నిర్ణయించుకొనును. (రోమా. 9 : 20, 21, మత్త. 22 : 14; అపొ. 13 : 48)

(3) రమ్మనుట — సంరక్షకుడగు దేవుడు రక్షించుకొరకు పాపిని రమ్మని పిలుచుచున్నాడు. ఆ ఆహ్వానమును అందరు విందురు, కాని కొందరు ఒప్పుకొందురు. పిలుపులు రెండు. ఒక్కటి రక్షణార్థము. మరొక్కటి సేవార్థము. ఒకనికొక్కటియు, ఇంకొక్కనికి రెండును కలుగుట కద్దు. (యెష. 45 : 22, 65 : 14. మత్త. 11 : 28; 22 : 24)

(4) రక్షించుట — సంపూర్ణరూపముగ దేవుడు పాపిని నీతిమంతునిగా తీర్చుచున్నాడు. అనగా ఆదాము పాపములో పడకముందు ఏ స్థితి యందుండెనో ఆ స్థితి యందుండునట్లు క్రీస్తునందు దేవుడు పాపిని ఎంచుట యై యున్నది. ఒకప్పుడు పాపి దేవుని శత్రువు. ఇప్పుడు పుత్రునిగా ఎంచెను. అవిశ్వాసి విశ్వాసి అగును. అపాత్రుడు పాత్రుడగును. (రోమా. 4 : 3; 7 : 8; [illegible] : [illegible]5; 1 కొరి. 6 : 11)

(5) మహిమపరచుట — సంపూర్ణుడగు దేవుడు విశ్వాసిని మరణానంతరమున మహిమపరచును. ఇప్పుడు మంటి స్వరూపి, ఇప్పుడు మహిమ స్వరూపి అగును. (యోహా. 1[illegible] : 22, 1 కొరి. [illegible] : 7, హెబ్రీ. [illegible] : 10 ఫిలి. 3 : 2[illegible])

'మనమిక ఏమవుదుమో అది ఇంక ప్రత్యక్షపరచబడలేదు, కాని ఆయన ప్రత్యక్షమైనప్పుడు......ఆయనను పోలియుందుము' (1 యోహా. 3 : 2)

## 6. ప్రభువుతోడి పరిశుద్ధుని సప్తసంయోగములు

## . THE SEVEN "TOGETHERS" OF THE SAINT

పతితుడు ఏదెనులో దేవునితోడి వియోగియై దేవభ్రష్టుడయ్యెను. ఇప్పుడు పరిశుద్ధుడు క్రీస్తుతోడి సంయోగియై పరమానందము పొందుచున్నాడు. ఈ సంయోగమువలన క్రీస్తును నిజ క్రైస్తవుడును 'ఏకాత్మ' అగుచున్నారు. (1 కొరి. 6 : 17) ఈ సంయోగము సత్యమును నిత్యమును, అదృశ్యమును ఆత్మీయమునై యున్నది. అవిశ్వాసమున వియోగమును, విశ్వాసమున సంయోగమును కల్గును. సత్ క్రైస్తవుని సప్త సంయోగము లేవన —

(1) క్రీస్తుతో కూడ మహాత్యాగము చేయుట.

'క్రీస్తుతో కూడ సిలువ వేయబడి యున్నాను.' సిలువ అనగా మహాత్యాగము. ఫిలి 2 : 5–8 లో క్రీస్తు మహాత్యాగము చేసినట్లు క్రైస్తవుడును క్రీస్తుకొరకు మహాత్యాగము చేయువలెను. (గల. 2 : 20, మత్త. 16 : 25, 26)

(2) క్రీస్తుతోకూడ మరణించుట.

'క్రీస్తుతోకూడ మృతిబొందినవారు.' విశ్వాసి పాపములో చని పోగా, విశ్వాసి పాపమునకు మరణించును. (కొలొ. 2 : 20. రోమా. 6 : 2, 11)

(3) క్రీస్తుతో కూడ సమాధి చేయబడుట

'ఆయనతో కూడ పాతిపెట్టబడితిమి.' 'బాప్తిస్మమునందు' విశ్వాసి పాపములు పాతిపెట్టబడెను. (రోమా. 6 : 4. గల. 6 : 14. కొలొ. 2 : 11)

(4) క్రీస్తుతో కూడ సజీవుడగుట.

'క్రీస్తుతో కూడ బ్రతికించెను.' పునర్జన్మమువలన విశ్వాసి పునర్జీవము పొందెను. (ఎఫె. 2 : 1, 5. యోహా. 11 : 25, 26)

(5) క్రీస్తుతో కూడ మరల లేపబడుట.

'క్రీస్తుతో కూడ లేపబడినవారు.' పునర్జీవముగలవాడు ప్రభుని పునరుత్థానములో పాలుపొందును. (కొలొ. 3 : 1-4, 1 కొరి. 15 : 22, 45, 48, 49)

(6) క్రీస్తుతో కూడ మహాశ్రమ పొందుట.

'ఆయన శ్రమలలో పాలివాడవు' శ్రమానుభవములో శ్రమానందముకలదు. (2 కొరి. 1 : 17, కొలొ. 1 : 24. రోమా. 8 : 17, 18)

(7) క్రీస్తుతో కూడ మహిమపొందుట.

ఆయన రెండవమారు వచ్చినపుడు 'పరలోకమునందు ఆయనతో కూడ కూర్చుండబెట్టుట.' (ఎఫె. 2 : 6, రోమా. 8 : 17, 1 పేతు. 5 : 10)

'ఎవడైనను క్రీస్తునందున్నయెడల వాడు నూతన సృష్టి.' (2 కొరి. 5 : 17)

## 7. సంసారము, భూలోక స్వర్గము

## HOME, AN EARTHLY HEAVEN

గృహ నిర్మాణకుడు — మనుష్యుడు. కుటుంబ నిర్మాణకుడు — దేవుడు. (కీర్త. 127 : 1)

పురుషుడు సంపూర్ణ సంసారి కాడని దేవుడు స్త్రీని సృజించెను. అబ్రాము కుటుంబమువలన సర్వలోకమునకు అబ్రాహామును, అబ్రాహాము కుటుంబమువలన ఆశీర్వాదమును కలిగెను. (ఆది. 12 : 3). మంచి సంసారము మాధుర్యమును. చెడ్డ సంసారము చేదును కాబోలు!

అబ్రాహాము, యాకోబు, యెహోషువ, దావీదు, యోబు, లాజరు, కొర్నేలి, లూదియ, క్రిస్పు, లోయి మున్నగువార కుటుంబములు మంచివని మనకు తెలియును.

మాదిరి కుటుంబపు మంచిలక్షణము లేవన — సన్మార్గము, సంపాదన సద్వినియోగము, సతి, సంతానము, సజీవము, సమాధానములని కీర్త. 128 లో చెప్పబడెను.

సత్యవేదపఠనము, సత్యారాధన, సత్ప్రవర్తనము, సంఘీభావము, సహనము, సంతోష సమాధానములు సత్కుటుంబ సత్ఫలములు. (ద్వితీ. 4 : 9, 10. 1 కొరి. 16 : 19. 1 తిమో. 3 : 4, 5, 12. కీర్త. 133 : 1. [illegible]. 18 : [illegible], 22; ద్వితీ. 14 : 26)

సంసారము సాగరము కాదు. సంస్థానము. తండ్రి — రాజు, తల్లి — మంత్రిణి, బిడ్డలు — పౌరులు, బైబిలు — రాజశాసనము, దేవదూతలు — సంరక్షకభటులు, యేసుక్రీస్తు — సర్వాధికారి, సత్రము — భూలోకము, స్వగృహము — పరలోకము, సాతాను — శత్రువు. ఇట్లగునేని సంసారము సంఘమునకు నారుమడికదా? నారు మంచిదైన పైరు మంచిదగును.

ఒక మహానీయుడిట్లనియె — కుటుంబాశీర్వాదము లేవన — సన్మార్గము సంసార కిరీటము, సక్రమము సంసార సౌందర్యము, సత్కారము సంసార మహిమ, సంతృప్తి సంసార సౌభాగ్యము.

'నేనును నా యింటివారును యెహోవాను సేవించెదము'. (యెహో. 24 : 15)

## 8. ఎక్కడ క్రీస్తుండునో, అక్కడ సంఘముండును

### UBI CHRISTUS, IBI EKKLESIA

తండ్రి యైన దేవుడొక్కడు ప్రభువొక్కడు. ఆత్మయును ఒక్కడు, శరీర (సంఘ) మొక్కటి, నిరీక్షణ ఒక్కటి, విశ్వాస మొక్కటి, బాప్తిస్మము ఒక్కటి అను సప్తాంశములు సర్వసంఘ విశ్వాస సారము. ఈ సువర్ణ సూత్రములతో పరదైసును సంపాదించు, పరము రాజ్యమును స్థాపించుటే సంఘ ప్రథమోద్దేశము [illegible]ములగు నాల్గు సంఘ కర్తవ్యము లేవన —

(1) సంస్మరణము. (హెబ్రీ. 13 : 15)

(ఎ) హల్లెలూయా (హల్లెల్, ఊ, యా = స్తుతించుడి మీరు యెహోవాను) అనునదే సంఘముయొక్క నిత్యగీతమును, సత్యసంగీతమునై యున్నది. (కీర్త. 150)

(బి) పరలోకములో దేవదూతల ననుసరించి నరలోకములో దేవునిబిడ్డలు త్రియేక దేవుని స్తుతింపవలెను. (యెష. 6 : 3, లూకా 2 : 14; ప్రక. 5 : 12)

(సి) సర్వసృష్టిని అనుసరించి సంఘము దేవునిని సన్నుతింపవలెను. (కీర్త. 148 : 1-10, 150 : 6)

(2) సంరక్షణము (అపొ. 2 : 42)

(ఎ) సంఘము (Ekklesia) అనగా లోకమునుండియు, పాపమునుండియు దేవునివలన బైటికి పిలువబడినది. అది లోకములోనుండును, కాని లోకము దానిలో నుండరాదు. స్థానికసంఘము సార్వత్రిక సంఘమునకు నారుమడి కదా ?

(బి) సంఘస్థులనగా విశ్వాసులై బాప్తిస్మమును పొంది, విధేయులై ప్రభు భోజనములో పాలుపొందుచు, పరిశుద్ధాత్మ పరిపూర్ణులై ప్రభునికొరకు జీవించి, ఆయనను సేవించువారై యున్నారు.

(సి) సంఘ కాపరి ముందరకు మాదిరిగానుండి, దానికి మేపును, కాపు నిచ్చుచు సంఘము స్వపోషణ స్వవ్యాపనములందు వృద్ధిపొందు నట్లు పాటుపడవలెను. (అ. పొ. 20:28)

(3) సంస్కారము (మత్త. 18:18)

(ఎ) పాపములలో తలక్రిందైన లోకమును పాటుపరచుట తన భారమని సంఘము గ్రహించి, దానిని వహింపవలెను.

(బి) సంఘ క్రమశిక్షణ సంఘ సంరక్షణ అని సంఘ పరిశుద్ధత కొరకును సంపూర్ణశక్తితో ప్రయాసపడ ప్రారంభింపవలెను.

(సి) దేశ దురాచారములు, దురభ్యాసములు మున్నగునవి సంస్కరించుటకు సామ్రాజ్యముతో సహకరింపవలెను.

(4) సంహారణము. (ఎఫె. 6:11-18, రోమా. 16:20)

(ఎ) శోధకుడగు సాతానుకు సంఘములో చోటీయరాదు.

(బి) దయ్యములను తరిమివేయుటయు, మంత్రతంత్రాదులను మటుమాయము చేయుటయు, హానికరములగు పరిశోధనను అడ్డగించుటయు సంఘ బాధ్యతయు సాధ్యతయు నైయున్నది.

(సి) సంఘసభ్యులు సర్వాంగ కవచమును ధరించి, మొలకవగా నుండి ప్రారంభింపవలెను. 'ఆత్మ ఖడ్గమును' ధరింపవలెను.

'క్రీస్తుకూడ సంఘమును ప్రేమించి... మహిమగల సంఘముగాను ఆయన తన యెదుట నిలువబెట్టుకొనవలెనని... దాని పవిత్రపరచి పరిశుద్ధ పరచుటకై దానికొరకు తన్నుతాను అప్పగించుకొనెను.' (ఎఫె. 5:25-27)

## 9. పరిశుద్ధాత్మ పరిశుద్ధుని పరదైసు కొరకు సిద్ధపర్చును

## THE SPIRIT PREPARES THE SAINT FOR PARADISE

పరిశుద్ధాత్మ పరిశుద్ధత్రిత్వము నందలి మూడవ పురుషుడు. ఆయ నకు 34 సార్థకనామములు కలవు. ఆది. 1:2 మొదలుకొని, ప్రక.

22 : 17 వరకు ఆయన నామము కనబడును. పరక్లేటొస్ (ఆదరణకర్త) అనగా ప్రక్కకు పిలువబడినవాడని వ్యుత్పత్త్యర్థము. దేవునాత్మ దివారాత్రులు పరిశుద్ధుని ప్రక్కన నుండుట ఎంత ఆదరణీయము! ఆయన పని ప్రభుని ప్రాయశ్చిత్తముతో ఆరంభమాయెను. (యోహా. 7 : 39) పరిశుద్ధాత్ముని పనులేవన –

(1) మానవ నిర్మాణమున పరిశుద్ధాత్మ పాలుపొందెను. (యోబు. 33 : 4)

(2) పాపమును, నీతిని, తీర్పును ఒప్పుకొన చేయును. (యోహా. 16 : 8-11)

(3) ఆత్మజన్మమును అనుగ్రహించును. (యోహా. 3 : 3, 5, 1 యోహా. 5 : 4)

(4) సమాజజీవమును, సంపూర్ణాత్మీయ జీవమొసగును. (కీర్త. 104 : 30, తీతు. 3 : 5)

(5) పరిశుద్ధపరచి ప్రతిష్ఠించును. (రోమా. 15 : 16)
(6) బలహీనతలందు తోడ్పడును. (రోమా. 8 : 26)
(7) సద్భక్తిలో నడిపించును. (యోహా. 14 : 26)
(8) ప్రభుని సంగతులను ప్రబోధించును. (యోహా. 14 : 26)
(9) ఆత్మీయ వరములను అనుగ్రహించును. (1 కొరి. 12 : 4)
(10) అద్భుతములను చేయించును. (మత్త. 12 : 28)
(11) విశ్వాసిలో నిత్యము నివసించును. (యోహా. 14 : 16, 17)
(12) భవిష్యత్తును బయలుపర్చును. (అపొ. 21 : 11)

'పరిశుద్ధాత్మను దుఃఖపరచకుడి, విమోచన దినమువరకు ఆయన యందు మీరు ముద్రింపబడియున్నారు.' (ఎఫె. 4 : 30)

## 10. మరణము–మరణకరముకాదు; మహిమకరము

### DEATH, NOT DEADLY, BUT DIVINELY

మరణము మానవ పితార్జితము. మరణ మనగా ఆత్మ శరీరము నుండి వేరగుట. మొదటి ఆదాము వలన మరణమును, రెండవ ఆదాము (క్రీస్తు) వలన జీవమును కలిగెను; కావున విశ్వాసి, అవిశ్వాసి మరణములకు విశేష వ్యత్యాసము కలదు. విశ్వాసి మరణము విమోచనకరము. అవిశ్వాసి మరణము వినాశనకరము. ఫిలి. 1 : 21 లో 'చావైతే లాభము' అని పౌలు సందేశించెను. ఎందుకనగా —

(1) మరణము మానవజీవితాంతము కాదు; జీవారంభము. ఐహిక జీవము అత్యల్పము; ఆముష్మిక జీవము అత్యధికము. 'నేను వెడలిపోయి క్రీస్తుతోకూడ నుండవలెనని నాకు ఆశయున్నది''. (ఫిలి. 1 : 2)

(2) మరణము మరణకారము కాదు; మహిమకారము. అది మరణకరము కాదు; మహిమకరము. (యోహా. 11 : 4)

(3) మరణము దయ్యాల సంబంధము కాదు; దైవసంబంధము. ''యెహోవా భక్తుల మరణము ఆయన దృష్టికి విలువ గలది'. (కీర్త. 116 : 15)

(4) మరణము అనర్థకము కాదు; నిరర్థకము. క్రీస్తు మృత్యుంజయము వలన మరణము కోరలులేని పామును, కొండివిరిగిన తేలును పోలి యున్నది. ప్రభువు 'మరణమును నిరర్థకము చేసెను' గదా? (2 తిమో. 1 : 10)

(5) మరణము పెద్ద నిద్ర కాదు; కొద్ది నిద్ర. క్రీస్తు రెండవ రాకడలో 'సమాధులలో నిద్రించు అనేకులు మేలుకొనెదరు'. (దాని. 12 : 2; 1 థెస్స. 4 : 14)

(6) మరణము ప్రభునితోడి వియోగము కాదు; సంయోగము. 'మరణాంధకారపు లోయలో నేను సంచరించినను...నీవు నాకు తోడై యుందువు.' (కీర్త. 23 : 4)

(7) మరణము అశాంతికరము కాదు; సుశాంతికరము. 'వారు విశ్రాంతిలో ప్రవేశించుచున్నారు.' (యెష. 57 : 2)

(8) మరణము నిర్జీవమార్గము కాదు; జీవమార్గము. 'దరిద్రుడు (లాజరు) చనిపోయి దేవదూతలచేత అబ్రాహాము రొమ్మున (ఆనుకొనుటకు) కొనిపోబడెను'. (లూకా. 16 : 22)

(9) మరణము శిక్షాధారము కాదు; రక్షణాధారము. 'మీకొరకు సిద్ధపర్చబడిన రాజ్యమును స్వతంత్రించుకొనుడి.' (మత్త. 25 : 34)

(10) మరణాంతమున నిత్యనాశము కాదు; నిత్యజీవము. 'నీతిమంతులు నిత్యజీవమును పొందను పోవుదురు.' (మత్త. 25 : 46)

(11) మరణానంతరమున పునర్జన్మము (జన్మాంతరము) కాదు; పునరుత్థానము. 'మేలు చేసినవారు జీవ పునరుత్థానమునకును ... వచ్చెదరు.' (యోహా. 5 : 29)

(12) మరణాంతమున అవమానము కాదు; అక్షయ కిరీటము. 'మనమైతే అక్షయమగు కిరీటము పొందుటకు మితముగా నున్నాము.' (1 కొరి. 9 : 25)

'మనము బ్రతికినను, చనిపోయినను, ప్రభువు వారమైయున్నాము. తాను మృతులకును సజీవులకును ప్రభువై యుండుటకు ఇందు నిమిత్తమే కదా క్రీస్తు చనిపోయి (మరల) బ్రదికెను.' (రోమా. 14 : 8, 9)

# 4. విముక్తుడు



## మానవుడు - క్రీస్తు తోడి వారసుడు

## MAN, the CO-HEIR with CHRIST

'మనము (దేవుని) పిల్లలమైతే వారసులము, అనగా దేవుని వారసులము; క్రీస్తుతో కూడ మహిమ పొందుటకై ఆయనతో శ్రమపడిన యెడల క్రీస్తు తోడి వారసులము.' (రోమా. 8 : 17)

### 1. పరిశుద్ధులకు పరదైసులో ప్రభుని స్వాగతము

### THE PRINCELY WELCOME IN PARADISE

మొదటి ఆదాము పరదైసు (ఏదేను) ను తన స్వభోగమున పోగొట్టుకొనగా, రెండవ ఆదాము (క్రీస్తు) తన స్వయాగమున సంపాదించుట ఎంతయో భావగర్భితము.

మానవాత్మ మరణానంతరము పొందబోవు శాంతి లోకమే పరదైసు. (లూకా. 23 : 43, 2 కొరి. 12 : 4, ప్రక. 2 : 7) ఏదేను మొదటి పరదైసు. అది పదార్థ సంబంధము. తాత్కాలికము. యేసు క్రీస్తు రెండవ పరదైసు. ఇది పరమార్థ సంబంధము. స్థావరము. ఎంత భేదము! (మత్త. 11 : 28)

పరమదేవుడును, పరిశుద్ధదూతలును పరదైసు ప్రథమ నివాసియగు హేబెలునకు ఎంతో సంతోషస్వాగత మిచ్చిరి. 'అతడు మృతి బొందియు...మాటలాడుచున్నాడు.' హేబెలనగా వ్యర్థము. అతడు లోకములో వ్యర్థమైనను సార్థక బల్యర్పణము చేసెను. (ఆది. 4 : 8; మత్త. 23 : 35; హెబ్రీ. 11 : 4; 1 యోహా. 3 : 12; యూదా 11)

అది మొదలు విశ్వాసులు స్త్రీలేమి, పురుషులేమి, శిశురత్నములేమి అసంఖ్యాయులు ఒకరి వెంబడి మరొకరు రేయనక పగలనక అందు ప్రవేశించుట ఎంత గంభీరము! ఇద్దరు హనోకు ఏలీయాలు మరణింపకయే మహిమ పర్చబడిరి.

పరదైసులో ప్రవేశించునప్పుడే లోక పాపబాధలనుండు పరిశుద్ధుడగు ప్రభువు శాంతి స్వాగతమిచ్చుచుండుట ఎంతటి సంతోషకరము! సిలువనాథుడు సిలువమీద దొంగకును అభయమొసగి, ఆహ్వానించెను గదా? మొదటి హతసాక్షియు, హితసాక్షియునగు స్తెఫనుకు సందర్శనమిడి, స్వాగతమిచ్చెను. ఏమి భాగ్యము!

పరమ పరదైసులో పరిశుద్ధులు సజీవులై, సంతోష సహవాసులై ప్రభుని సన్నిధిలో నుందురు. (2 కొరి 5 : 1-8; హెబ్రీ 12 : 23; ఫిలి. 1 : 23; ప్రక. 6 : 9-11)

విశ్వాసి మరణమునకు పూర్వము ప్రభుని—ఓ—తండ్రీ! నీ చేతికి నా ఆత్మను అప్పగించుకొనుచున్నానని ప్రార్థించినయెడ — నేడు నీవు నాతో కూడ పరదైసులో నుందువని ప్రభువు దయారస మొలుక పలుకును గదా?

'ఆ దరిద్రుడు చనిపోయి, దేవదూతలచేత అబ్రాహాము రొమ్మున (అనుకొనుటకు) కొనిపోబడెను' (లూకా 16 : 22)

## 2. మృతుల ఆత్మల మధ్య స్థితి

## THE INTERMEDIATE STATE OF THE IMMORTAL

మనుష్యుడు మరణింపగానే వాని శరీరాత్మలు వేరగును. ఇది శరీర మరణము. మానవ పిత్రార్జిత మిదే కాబోలు!

దేహముతోపాటు ఆత్మయు చనిపోదు; (అపొ. 23 : 8) అది భూమిమీద దయ్యమై సంచరింపదు; అది పునర్జన్మమును (జన్మాంతరమును) పొందదు; పర్గెటోరి అను స్థలమునకును వెళ్ళదు; అంతియకాదు; మంచి ఆత్మ పరలోకమునకును, చెడ్డ ఆత్మ నరకమునకును వెంటనే వెళ్ళును; (అపొ. 2 : 25-27; 23 : 8; 2 తిమో. 2 : 16-18; 1 యోహా. 1 : 7,9) ప్రసంగి పలికినట్లు మన్ను (Adamah) అయినది మన్నగును; ఆత్మ దైవనిర్ణీత స్థలమునకు వెళ్ళును. (ప్రస. 12 : 7)

ఆత్మలు మంచివైనను, చెడ్డవైనను మధ్య స్థితియందుండి, పునరుత్థానము వరకు అందు భద్రపరచబడును. ఆ మధ్యస్థితి హెబ్రీ భాషలో షీయోలు (Shoel) అనియు, గ్రీకు భాషలో హేడెస్ (Hades) అనియు, తెలుగులో అదృశ్య పాతాళ, మృతుల లోకమనియు చెప్పుదురు. (మత్త. 16 : 18; ప్రక. 1 : 18)

నీతిమంతుల ఆత్మలుండు భాగమును పరదైసు, అబ్రాహాము రొమ్ము అందురు. అనీతిమంతులుండు భాగము అగ్నిజ్వాలా మయమైనది. ఈ రెంటికి మధ్య 'మహాగాధము' కలదు. (లూకా. 16 : 22-26; 23 : 43)

విశ్వాసులేమి, అవిశ్వాసులేమి అందు తెలివియు, జ్ఞానమును కలిగియుందురు. (లూకా 16 : 19-31). నీతిమంతులు సుఖమందును, అనీతిమంతులు దుఃఖమందు నుందురు. వారు అక్కడను వీరు ఇక్కడను, పునరుత్థానము వరకు వేచియుందురు. పరిశుద్ధులు ప్రభువు సన్నిధిలో నివసింతురు, కాని అపవిత్రులు న్యాయ విమర్శకొరకు భయముతో ఎదురు చూచుచుందురు. (2 కొరి. 5 : 6-8; 2 పేతు. 2 : 9, 10)

ఒకప్పుడొక నాస్తికుడు శవపేటిక మోయువారిని చూచి — అన్నిటి అంత మదే అనగా అది కాదు; మరణము తర్వాత మహా విమర్శ జరుగునని క్రైస్తవ మారకుడు వానిని ఖండించెను. మరణము జీవాంతము కాదు; జీవారంభము.

'...ఇప్పుడైతే (లాజరు) ఇక్కడ నెమ్మది పొందుచున్నాడు, నీవు (ధనవంతుడు) యాతన పొందుచున్నావు.' (లూకా 16 : 25)

## 3. రక్షకుని రెండవ రాకడ

## THE SECOND COMING OF THE SAVIOUR

రక్షకుని రాకడను గూర్చి పా. ని. లో ప్రవక్తలును, క్రొ. ని. లో ప్రభువును, దేవదూతలును, అపొస్తలులును ప్రకటించిరి. అంతేకాదు, ప్రభు భోజనమును ప్రవచించును. (దాని. 7 : 13; యూదా. 14, యోహా. 14 : 3. అపొ. 1 : 11, 1 థెస్స. 4 : 6, 1 కొరి. 11 : 26)

మొదటి రాకడలో క్రీస్తు పరిచర్య చేసెను; రెండవ రాకడలో పరిపాలన చేయును. అప్పుడు పరిహారము వచ్చెను; ఇప్పుడు మహిమాధారము వచ్చును. మొదట విమోచించెను; రెండవసారి విమర్శించును. మొదటిసారి 'లోకము ఆయనను తెలిసికొనలేదు'. రెండవసారి 'అందరు రొమ్ము కొట్టుకొందురు'. (యోహా. 1 : 10; ప్రక. 1 : 7)

మరణము రెండవసారి లేకుండుట! (1 కొరి. 1 : 26-55) పరిశుద్ధాత్మ సమ్మరింపు రెండవసారి [illegible]; (యోహా. 14 : 2, 3; యెరూషలేము నాశనము రెండవసారి రాదు (మత్త. 24 : 1-51) మరియు క్రీస్తు పునరాగమనము యొక్క తేదీలు నిర్ణయింపరాదు. (మార్కు 14 : 3?; ?; అపో. 1 : 7) ఆయన త్వరలో వచ్చును.

ప్రభువు రాకకు పూర్వము బహుసూచనలు జరుగును. (దాని. 12 : 4; మత్త. 24 : 6-8, 14; 2 తిమో. 3 : 1)

ఆయన వెయ్యేండ్ల యేలుబడికి ముందు వచ్చునా (Pre-Millennial View) లేక తరువాత వచ్చునా (Post-Millennial View) అను రెండు మహా వివాదములు కలవు. మొదటిది సత్యమని ఎల్లరికి తేటతెల్లము. (ప్రక. 20 : 1-6)

ప్రభువు తెలియని గడియలో వచ్చును; కనుక సంఘము (ప్రక. 19 : 6-9), సంఘస్థులు (2 పేతు. 3 : 11, 12), సంఘసేవకులు (మత్త. 24 : 14), క్రైస్తవ రాష్ట్రములు (అపో. 16 . 9), సర్వసృష్టి (రోమా 8 : 19-23), సిద్ధపడవలెను.

'మీరు అనుకొనని గడియలో మనుష్యకుమారుడు వచ్చును: గనుక మీరు సిద్ధముగా నుండుడి'. (లూకా 12 : 40)

## 4. పరిశుద్ధులు ప్రప్రథమమున లేతురు

## THE RIGHTEOUS SHALL RISE FIRST

క్రీస్తు ప్రభుని మృత్యుంజయము ప్రభుని ఆరోహణత్వమును, బైబిలు అక్షయతను, సంఘము అధికారమును, విశ్వాసుల అమరత్వమును, సాతాను అపజయమును వేనోళ్ళ చాటుచున్నది. మనుష్యుడు మరణించిన మరల పునరుత్థానుడగుట మహాద్భుతము.

విశ్వాసి పునరుత్థానము నందలి విశేషాంశము లేవన —

(1) పునరుత్థాన సాక్ష్యము — అప్పుడప్పుడు అక్కడక్కడ కొందరు మానవ పునరుత్థానము మహాబద్ధమనిరి. పా. ని. లో యోబు, దావీదు, యెషయా, దానియేలు, యెహెజ్కేలు, హోషేయ మున్నగు వారును, క్రొ. ని. లో ప్రభువును, జీవమాతలును, అపొస్తలులును బోధించిరి. వారి ప్రబోధములు ఎంత ప్రమోదములు!

(2) పునరుత్థాన సాదృశ్యములు - ప్రభుని సర్వశక్తివలన పా.ని.లో ఇద్దరు బాలకులు మరొకడు (2 రాజు 13 : 21) క్రొ. ని. లో యాయీరు కుమార్తె, విధవా కుమారుడు, లాజరు, పరిశుద్ధులు (మత్త. 27 : 52), దొర్కా, ఐతుకు అనువారు లేపబడిరి. ఈ పునరుత్థాన ప్రదర్శనములు పునరుత్థాన నిదర్శనములు కదా!

(3) పునరుత్థానసాధ్యతలు - మూడవనాడు యేసుదేవుడు మృత్యుంజయుడగుటవలనను, బైబిలులో కొందరు బ్రతికింపబడుటవలనను సర్వ మానవ పునరుత్థానము సర్వసత్యమని స్థాపితమయ్యెను. ఈ సత్య సిద్ధాంతమునకు పౌలు సత్యవేదాంతి అని చెప్పనొప్పును (1 కొరి. 15)

(4) పునరుత్థాన సారూప్యము — మృతులు ఎట్టి శరీరములతో లేతురు?

(ఎ) వారు మంచి శరీరములతో లేతురు (1 కొరి. 15 : 35-38)

(బి) వారు మహిమ శరీరములతో లేతురు. (1 కొరి. 15 : 42-54)

(సి) వారు మహోత్తమ శరీరములతో లేతురు. (1 కొరి. 15 : 44)

(డి) వారు మనుష్యకుమారుని శరీరమువంటి శరీరములతో లేతురు. (ఫిలి. 1 : 23)

ప్రస్తుత శరీరములు ప్రపంచ పరిస్థితులకు అనుకూలించునట్లు, పునరుత్థాన శరీరములు పరమపరిస్థితికి అనుకూలించునని గ్రహింపగలము. (1 కొరి. 15:42-54; 2 కొరి. 5 : 1-4)

(5) పునరుత్థాన సాఫల్యతలు —

(ఎ) పరిశుద్ధులు త్రియేక దేవుని శక్తివలన లేపబడుదురు. (మత్త. 22 : 29; యోహా. 5 : 28, 29; రోమా. 8 : 11)

(బి) ప్రభువు వచ్చునపుడు మొదట నీతిమంతులు లేతురు. (1 థెస్స. 4 : 16; 1 కొరి. 15 : 23)

(సి) వారు మేఘములలో ఆయనను సంధింతురు. (థెస్స. 4 : 17)

(డి) వారు స్త్రీపురుష భేదములేక దూతలవలె నుందురు. (మత్త. 22 : 30)

(ఇ) ఆత్మతోపాటు శరీరము మహిమపర్చబడుటవలన మానవుడు తన శరీరమును ఎంతో భద్రముగా కాపాడుకొనవలెనుగదా ?

తెరవబడియుండు క్రీస్తు సమాధి నిత్యజీవ ద్వారమని ఒక ఆంగ్ల కవి సెలవిచ్చెను. ప్రభుని సమాధి వట్టిది. కనుక పరిశుద్ధుల సమాధులును వట్టివగును.

'బూర మ్రోగును; అప్పుడు మృతులు అక్షయులుగా లేపబడుదురు.' (1 కొరి. 15 : 53; 1 థెస్స. 4 : 16)

## 5. సజీవులగు పరిశుద్ధులు ప్రభుని సంధింతురు

## ALL SAINTS THAT ARE ALIVE SHALL MEET HIM IN THE AIR

భూమి గుండ్రముగా నుండుటవలన ప్రభుని ప్రత్యక్షత (Parousia) కొన్ని ప్రదేశములలో రాత్రియు, మరికొన్ని ప్రదేశములలో పగలును సంభవించునని గ్రాహ్యమగును. (లూకా 17 : 34)

గుడియందేమి, గృహమునందేమి, సంసారములందేమి, సంఘము లందేమి ప్రభుని పునరాగమనము కొరకు సిద్ధపడినవారు తీసికొని పోబడుదురు. సిద్ధపడనివారు విడిచిపెట్టబడుదురు. (మత్త. 24 : 40, 41; లూకా. 17 : 34)

కడబూర మ్రోగగానే సజీవులగు విశ్వాసులు మార్చబడి, మహిమ శరీరములు ధరించుకొందురు. (1 కొరి. 15 : 52)

దేవదూతలు నీతిమంతులను అనీతిమంతులను చక్కగా వేరు పరతురు. (మత్త. 24 : 31)

అనుదిన జీవితములందు విశ్వాసులు సఫలతలను, అవిశ్వాసులు విఫలతలను పొందుట తథ్యము.

పరలోకము మనలో ఎంత ప్రవేశించునో అంత మనము పరలోకములో ప్రవేశింతుమని డాక్టరు వింటన్ సెలవిచ్చెను.

దేవదూతలు 'ఆకాశముయొక్క ఈచివరనుండి ఆచివర వరకు నలు దిక్కులనుండి ఆయన ఏర్పరచుకొనిన వారిని పోగుచేతురు' (మత్త. 24 : 31)

## 6. విముక్తులతో ప్రభుని వేయేండ్ల ఏలుబడి

## THE REIGN OF CHRIST WITH THE REDEEMED

ఈయేలుబడిలో మానవుని సంపూర్ణస్థితి పరదైసు (ఏదేను) లో నుండిన ప్రారంభస్థితికి మార్చబడుట ఆనందదాయకము. వేయేండ్ల ఏలుబడిలో విశేష సువిశేషము లేవనగా —

(1) ఇది కుదురుపాటు కాలము, ప్రపంచ పునర్జన్మకాలము అని పేర్కొనబడెను. (అపొ. 3 : 27; మత్త. 19 : 25)

(2) రారాజగు క్రీస్తు తన పరిశుద్ధులతో భూమిమీద వేయేండ్లు రాజ్యము చేయును. (ప్రక. 1 : 6; 20 : 1-6; 2 తిమో. 2 : 2; 1 కొరి. 4 : 8; 15 : 23-25)

(3) ఆ ఆనంద దినముల ఆశీర్వాదములలో ప్రపంచ జనాంగములు పాలుపొందును. అనేక జనాంగములు క్రీస్తును హత్తుకొనును. సంఖ్యా. 14 : 21; కీర్త. 67 : 72; 85 : 8-13, 96 : 10-13, యెష. 11 : 4-11, మీకా 4 : 1-4, హబ. 2 : 14, జెక. 2 : 11, 8 : 20-23)

(4) సర్వసృష్టియొక్క శాపము తొలగింపబడును. ఏదేనులో నుండినట్లు ఎల్ల జంతువులు సమాధానముతో సంచరించును. (రోమా. 8 : 19-22, యెష. 11 : 6-9)

(5) సర్వజనులమీద పరిశుద్ధాత్మ సంపూర్ణముగా కుమ్మరింప బడును. (యోవే. 2 : 28, 29, అపొ. 2 : 16–21)

(6) భూమిమీద నీతి విస్తరించును. (యెష. 32 : 8, 54 : 13, 14, 61 : 11)

(7) అప్పుడందరు ఆయురారోగ్యవంతులై యుందురు. (యెష. 65 : 20–22; 35 : 5, 6; 33 : 24)

(8) సాతాను బంధింపబడినను, పాపులింకను ఉండెదరు. (ప్రక. 20 : 1–6; యెష. 65 : 20; కీర్త. 66 : 3)

'ఈ మొదటి పునరుత్థానములో పాలుగలవారు ధన్యులును, పరిశుద్ధులునై యుందురు'. (ప్రక. 20 : 6)

## 7. మృతుల పునరుత్థానమును, మహావిమర్శయు

THE FINAL RESURRECTION AND THE FULL JUDGMENT

ప్రభువు రెండవసారివచ్చి, వేయేండ్లు పరిపాలన చేసిన తరువాత రెండవ పునరుత్థానమును న్యాయవిమర్శయు జరుగును. ఎట్లనగా —

(1) మర్త్య పునరుత్థానము —

అనీతిమంతుల పునరుత్థానమునకు తీర్పు పునరుత్థాన మందురు. నీతిమంతులవలె అనీతిమంతులను తమతమ పరిస్థితులకు తగినట్లు మార్పొందిన శరీరములను ధరింతురు. (ప్రక. 20 : 4–15; 1 థెస్స. 4: 14–7; దాని. 12 : 2; యోహా. 5 : 29)

(2) మహా విమర్శ —

మానవులందరు పిన్నపెద్దలు, స్త్రీ పురుషులు తమ తమ మనోవాక్క్రియలనుబట్టి అంత్యన్యాయ విమర్శపొందుదురు. (మత్త. 12 : 36, 37; 16 : 27; రోమా. 2 : 6, 9, 1 కొరి. 4 : 5, 2 కొరి. 5 : 10)

మానవులేకాక భ్రష్టులగు దూతలందరును విమర్శింపబడుదురు. (2 పేతు. 2 : 4, యూదా. 6, మత్త. 8 : 29)

విమర్శా విధానమేమనగా —

(ఎ) అన్యులు తమ మనస్సాక్షినిబట్టి తీర్పు పొందుదురు. (రోమా. 2 : 12, 14, 15)

(బి) యూదులు మోషే ధర్మశాస్త్రమునుబట్టి తీర్పు పొందుదురు. (రోమా. 2 : 12)

(సి) క్రైస్తవులు సువార్తనుబట్టి తీర్పుపొందుదురు. (యాకో. 2 : 12)

ప్రధాన న్యాయాధిపతియగు ప్రభువైన యేసుక్రీస్తు విమర్శించును. పరిశుద్ధులు తీర్పులోనికిరాక ప్రభునితో కూర్చుండి విమర్శింతురు. (మత్త. 25 : 31-46 1 కొరి. 6 : 2, 3, ప్రక. 20 : 4)

'ఆ గ్రంథములయందు వ్రాయబడియున్న వాటినిబట్టి తమ క్రియల చొప్పున మృతులు తీర్పుపొందుదురు.' (ప్రక. 20 : 12)

## 8. పరిపూర్ణ పరదైసు

## THE PERFECT PARADISE

పాత పరదైసు పరిపూర్ణమైనది కాదు. పడిపోయెను, చెడిపోయెను. కాని క్రొత్తపరదైసు పడిపోదు, చెడిపోదు. ఏలయన అది పరిశుద్ధమైనది, పరిపూర్ణమైనది. పరిపక్వమైనది. రెండుపరదైసులరీతులను ఆలోచింతము —

(1) పాతపరదైసు పాతసృష్టికిని, క్రొత్తపరదైసు క్రొత్తసృష్టికిని చెందును.

(2) అందు మొదటి ఆదామును, ఇందు రెండవ ఆదాము (క్రీస్తు) ను కలరు.

(3) అచ్చట పడిపోయిన మొదటి హవ్వయు, ఇచ్చట పరిశుద్ధపరపబడిన రెండవ హవ్వయు (సంఘము) కలరు.

(4) అక్కడ పాత పరదైసు (ఏదేను) ను, ఇక్కడ క్రొత్త పరదైసును కనబడును.

(5) అచ్చోట మానవ వినాశనమును, ఇచ్చోట మానవ విమోచనమును తెలియనగును.

(6) అది సహవాస భంగమును, ఇది సహవాస భాగ్యమును వివరించును.

(7) అప్పుడు మరణమును, ఇప్పుడు మరణము మీది విజయమును కలిగెను.

(8) నాడు వాగ్దానము చేయబడెను, నేడు వాగ్దానము సిద్ధించెను. (ఆది. 3 : 15)

(9) అందు జీవవృక్షమునుండి బహిష్కారమును, ఇందు జీవవృక్షమునకు ప్రవేశమును కలదు.

(10) భూమి అచ్చట శాపమును, ఇచ్చట శాపవిమోచనమును పొందెను.

(11) అక్కడ అపవాది ఆదాము హవ్వలను నాశనపాత్రుల చేసెను. ఇక్కడ తానే నాశనపాత్రుడాయెను. (ప్రక. 20 : 10)

(12) అందు సర్పసంతానము తాత్కాలిక విజయముపొందు-టాయెను, ఇందు స్త్రీసంతానము అనగా క్రీస్తును, క్రీస్తు వధువును శాశ్వత విజయమును పొందిరి. (ఆది. 1-3 అ.లు, ప్రక. 20-22 అ.లు)

'జయించువానికి దేవుని పరదైసులో ఉన్న జీవవృక్షఫలములు భుజింపనిత్తును.' (ప్రక. 2 : 7)

## 9. రక్షిత మానవుడును, శిక్షిత మానవుడును

## MAN, REDEEMED AND MAN, RUINED

మత్త. 18 : 24-30 ప్రకారము గోధుమలు — విశ్వాసులు, గురుగులు వినాశులు, కోతకాలము (యుగసమాప్తి) వరకు ఉభయులు కలసి మెలసి యుండుదురు. తరువాత గోధుమలు కొట్టు (పరలోకము) లో చేర్చబడును, గురుగులు (నరకమున) కాల్చివేయబడుదురు అని యేసుప్రభువు సెలవిచ్చెను. ఇది నిత్యసత్యము. ఎట్లన —

(1) పరలోకములో తండ్రి, కుమార, పరిశుద్ధాత్మలు అను త్రియేక దేవుడు సింహాసనాసీనుడై పరిశుద్ధదూతలచేత నిత్యము పూజింపబడు చుండును. అయితే అపవాదియు, క్రూరమృగమును, అబద్ధప్రవక్తయు, వాని దూతలును నరకములో నిరంతరము 'బాధింపబడుదురు.' (ప్రక. 20 : 10, 22 : 8)

(2) రక్షితులగు మానవులు పరలోకమున ప్రభుని సన్నిధానమున 'నిత్యజీవమును', శిక్షితులగు మానవులు నరకములో 'నిత్యశిక్షను' పొందుదురు. (మత్త. 25 : 46)

(3) ప్రభుని 'నామము' పరిశుద్ధుల నొసళ్ళయందును, అపవాది 'ముద్ర' అపరిశుద్ధులయందు నుండును. (ప్రక. 13 : 17 22 : 4)

(4) విమోచితులు దేవదేవుని ముఖదర్శనము చేయుచుందురు. వినాశకులకు 'ఏడ్పును, పండ్లు కొరుకుటయు' నుండును. (ప్రక. 22 : 4, మత్త. 25 : 30)

(5) పరిశుద్ధులు పరమేశ్వరుని నిరంతరము 'సేవించుచుందురు.' అపరిశుద్ధుల 'పురుగు చావదు, అగ్ని ఆరదు.' (ప్రక. 22 : 4, మార్కు. 19 : 38)

(6) పరమున 'రాత్రి' యుండదు, నరకమున గాఢాంధకారముండును. (ప్రక. 22 : 5, యూదా. 13)

(7) పరలోకములో శాపముండదు. నరకమున శాపముండును. (ప్రక. 22 . 3, మత్త. 25 : 41)

(8) రక్షితులు 'యుగయుగములు రాజ్యము చేయుదురు', శిక్షితులు 'దివారాత్రము బాధింపబడుదురు.' (ప్రక. 22 : 3; మత్త. 25 : 41)

'అప్పుడు రాజు తన కుడివైపున నున్న వారిని చూచి, నా తండ్రి చేత ఆశీర్వదింపబడిన వారలారా రండి...రాజ్యమును స్వతంత్రించుకొనుడి' అనియు, ఎడమవైపున ఉండు వారిని చూచి, 'శపింపబడిన వారలారా...నిత్యాగ్నిలోనికి పోవుడి' అనియు చెప్పును. (మత్త. 25 : 34, 41)

## 10. క్రీస్తుతోడి వారసుని కిరీటధారణము

## THE CO-HEIR WITH CHRIST, CROWNED

ప్రతి మానవుడు ఆదిలో (శిశుత్వమున) విశుద్ధుడును, ఆతర్వాత (పాప పతనమున) వినాశకుడును, అటుపిమ్మట క్రీస్తు నామమున విశ్వాసియు, అంత్యమున (పరమున) విముక్తుడును అగును. ఈ మానవ

మర్మము ఎంత వింత ! ఇదియే సువార్త; ఇది యేసు వార్త. హల్లెలూయ !

ప్రభుని సన్నిధానమున పరలోకములో మానవమహిమ అంతింత కాదు.

(1) మానవుడు మహిమ పర్యంకును. (యోహా. 17 : 24)

(2) అతడు క్రీస్తుతో కూర్చుండి విమర్శించును. (1 కొరి. 6 : 2)

(3) అతడు క్రీస్తుతో పరిపాలించును. (ప్రక. 22 : 5)

(4) అతడు క్రీస్తుతోడి వారసుడగును. (రోమా. 8 : 17)

మానవుని మహైశ్వర్యమేమన —

(1) పరమగృహమును, (2) పరిశుద్ధపట్టణమును, (3) పరలోక రాజ్యమును, (4) పరిపూర్ణ భాగ్యమును అభించును. (2 కొరి. 5 : 1, హెబ్రీ. 11 : 10, 12 : 28, మత్త. 19 : 21)

మానవుని మకుటము లేవన—

(1) ఆత్మీయులకు అక్షయ కిరీటము (1 కొరి. 9 : 25)

(2) నిజదాసులకు నీతికిరీటము (2 తిమో. 4 : 8)

(3) సేవకోత్తములకు జీవకిరీటము. (యాకో. 1 : 12)

(4) మంచికాపరులకు మహిమ కిరీటము. (1 పేతు. 5 : 4)

'మహిమా ప్రభావములతో వానికి కిరీటము ధరింపజేసియున్నావు' (కీర్త. 8 : 5, 21 : 5)



త్రివేణి ప్రెస్, మచిలీపట్టణము